వెల: 63 నయాపైసలు 

ఇందులో...

★ మౌర్య చంద్రగుప్తుడు

★ అశోకుడు

★ పుష్యమిత్రుడు

...కలవు

ద్వితీయ ముద్రణ 1958 గీతా ఆర్టు ప్రింటర్సు

# తొలి పలుకు



నేటి ప్రాథమిక విద్యా విధానంలోని, చరిత్ర బోధనా పద్ధతిని సంస్కరించవలసిన అవసరం నాకు కనిపించింది. కేవలం తారీఖులతోనూ, వంశానుక్రమణ పట్టికలతోనూ, చరిత్రను నింపటంకంటె — ముఖ్యంగా ప్రాథమిక విద్యార్థులకు — కథారూపంలో చరిత్ర పురుషుల జీవితాలతో ప్రారంభించి, చరిత్ర రచన సాగించటం ఎక్కువ ప్రయోజనకరమనే విశ్వాసంతో ఈ రచన కొనసాగించాను.

ఆంధ్రులకు ముఖ్యంగా, విద్యార్థులకు, ఇతోధికంగా మన చరిత్రపై ఉత్సాహాసక్తులు రేకెత్తించటమే నా ప్రయత్నంలోని ప్రధానాశయం.

చరిత్ర పురుషుల జీవిత గాథల సంపుటే, ఏ దేశమునకైనా చరిత్ర అవగలదు గనుక, మన చరిత్ర పురుషులను నాయకులుగా స్వీకరించి, ఈ చరిత్ర వ్రాయుచుంటిని.

కాగా మన చరిత్ర పూర్వభాగం గురించి, తగినన్ని ఆధారాలు మనకు లభించటంలేదు. అనేక చారిత్రకాంశములపై, పరస్పర విరుద్ధమైన విభిన్నాభిప్రాయములు గోచరించుచున్నవి. వీటన్నింటినీ చర్చించుకొనుచూ మీ మనస్సు చీకాకుపరచుటకంటె, ఎక్కువ ఆధారములుగల విషయములనే ప్రాతిపదికగాగొని, రచన కొనసాగించుట న్యాయమనిపించింది.

ఈ ప్రయత్నంలో అనేక అమూల్యమైన సలహాలనిచ్చి, ప్రోత్సహించి, ఆశీర్వదించిన విజయవాడ S. R. R. & C. V. R. కళాశాల చరిత్ర శాఖాధ్యక్షులు, పూజ్యశ్రీ చతుర్వేదుల రామనరసింహం గారికి నా కృతజ్ఞత తెలుపుకొంటున్నాను.

2—5—57
విజయవాడ 

నండూరి విఠల్‌బాబు.

# ప రి చ య ం



చిరంజీవి విఠల్ రచించిన చరిత్ర సాకల్యముగా చదివితిని. మన తెనుగు భాషలో ఇంత చక్కని చరిత్ర ఇంతకు ముందు వెలువడలేదు. ఇది అత్యుక్తి గాదు.

మొదటినుంచి చివరవరకు పాఠకులకు రవ్వంత యైన విసుగు జనించకుండా చక్కని శైలిలో ఈ యువకుడు 'మన చరిత్ర' రచించి, తెలుగులకు ఎనలేని సేవ చేయగల్గెను.

మన చరిత్రపై ఆసక్తిగల పాఠకులకు దాని నభ్యసింపవలసిన విద్యార్థులకు ఇది మిక్కిలి ప్రయోజనకరముగా నుండును.

యువ రచయిత విఠల్ వయసున పిన్నవాడైనను, రచనా వ్యాసంగమున దిట్టయని నిరూపించుకొనినాడు. చిరంజీవికి నా ఆశీస్సులు.

3—5—57
విజయవాడ.
S.R.R. & C.V.R.

(Sd) చతుర్వేదుల రామనరసింహం,
S. R. R. & C. V. R. కళాశాల
చారిత్ర శాఖాధ్యక్షులు.

# మౌర్య చంద్రగుప్తుడు

భారతదేశ చరిత్రలో పేర్కొనదగిన మొట్టమొదటి చక్రవర్తి చంద్రగుప్తుడు. అంతకు ముందు కాలం చీకటి యుగమని పిలువతగినట్టిది. మౌర్య సామ్రాజ్యమునకు పూర్వము భారతావనిలో రాజ్యములు లేవని కాదు. రాజులూ, సార్వభౌములూ పాలించలేదని కాదు. కాని వారిని గురించీ, వారి రాజ్యముల గురించీ తెలుసుకొనుటకు మనకు తగినన్ని చరిత్రకాధారములు లేవు.

అందుచేతనే మన చరిత్ర మౌర్య సామ్రాజ్యముతో ప్రారంభమౌతున్నదని చెప్పగల్గితిని.

మౌర్య సామ్రాజ్య స్థాపనకు పూర్వము ఆర్యావర్త మండలి రాజ్యములలో పేర్కొనదగినది నంద సామ్రాజ్యము. నందులకు పూర్వము శిశునాగ వంశానికి చెందిన పదిమంది రాజులు ఆర్యావర్తమును పరిపాలించారు. వారిలో కడపటి వారు నందివర్ధనుడు, మహానందులు. ఈ శిశునాగ వంశపు రాజులు షుమారు ఎనభై మూడు సంవత్సరాలు పాలించారు.

శిశునాగ వంశం తర్వాత అధికారం లోనికి వచ్చినది నందవంశం. వీరి సంతతివారు షుమారు ఒక శతాబ్దం పాటు మగధను పాలించారు.

నందులను గురించిగాని, వారి రాజ్యాన్ని, రాజ్యాంగాన్ని గురించిగాని తెలుసుకొనుటకు మనకు తగినన్ని

చారిత్రికాధారాలు కనిపించటంలేదు. పురాణాలలో కొన్ని చోట్ల నందుల ప్రసక్తి కనిపించింది. యింకా జైన బౌద్ధ గ్రంథాలలోనూ, గ్రీకు రచనలలోనూ నందులను గురించిన కొన్ని వివరాలు కనిపిస్తున్నాయి.

గ్రీకు చరిత్రకారులు నందుల్ని మహావీరులుగా వర్ణించారు. ఇరవై వేల అశ్వదళం, రెండులక్షల కాల్బలం, నాలుగు వేల గజదళం, నంద సైన్యంలో ఉండేదట!

అయితే ఈ నందుల్ని గురించి మనకు చరిత్రలో తగినన్ని వివరాలు దొరక్కపోవటానికి ఒక కారణం నాకు కనిపిస్తున్నది.

నందులు మహావీరులే. సంశయించ నవసరంలేదు. గొప్ప పరిపాలనా దక్షులు గూడ కావచ్చును. కాని వారు బ్రహ్మ ద్వేషులనీ, నీచులనీ నాటి రచయితలు భావించి వారి గ్రంథాలనుండి, నందులను బహిష్కరించి ఉండవచ్చు.

ఏమైననూ నందులు మొత్తం తొంభై సంవత్సరాలు మగధను పాలించారు. అనగా నందుల పాలన క్రీస్తు పుట్టక పూర్వం 413 సంవత్సరాలకు ప్రారంభమైంది. అప్పటినుంచి క్రీ॥ పూ॥ 322 వరకూ మగధ నందుల పరిపాలనలో ఉంది.

ఈ నందులకాలంలోనే గ్రీకు వీరుడు సికిందర్ మన దేశంపై దండెత్తి వచ్చాడు. సికిందర్‌కు మరొక పేరు అలెగ్జాండర్. పవిత్రమైన భారత భూభాగంపై దండెత్తిన మొట్ట మొదటి పాశ్చాత్య వీరుడు అలెగ్జాండర్.

క్రీ॥ పూ॥ 327 లో హిందూకుష్ పర్వతాలను దాటి అలెగ్జాండర్ భారత దేశంలో అడుగు పెట్టాడు. అక్కడ కొండజాతులవారు గ్రీకు సైనికుల్ని ఎదుర్కొన్నారు. కొండ జాతులతో యుద్ధం చేయటం చాలా కష్టతరమైన విషయం. వారు చేసే యుద్ధం గెరిల్లా యుద్ధం లాటిది. ఆ గెరిల్లా యుద్ధం వల్లనే మహారాష్ట్ర వీరుడు శివాజీ మొగల్ సామ్రాజ్యాన్ని గడగడ లాడించాడు. గెరిల్లా యుద్ధం చాలా చిత్రంగా ఉంటుంది. ఆ యుద్ధంలో ఉభయ పక్షాలూ ఒక మైదానం మీద ప్రత్యక్షంగా పోట్లాడటం జరగదు. గెరిల్లా యుద్ధం చేసేవారు అడవుల చాటునా, కొండల చాటునా పొంచి ఉంటారు. శత్రువులపై దెబ్బ తీస్తూంటారు. వారు శత్రువులకు కనిపించరు. కాని శత్రువులు వారికి కనిపిస్తారు. ఈ పద్ధతి యుద్ధం అలెగ్జాండర్‌ను చీకాకు పరిచింది. అయినా ఒక సంవత్సరంపాటు వారితో భీకరంగా యుద్ధం సాగించి, చివరికి వారిని లొంగదీశాడు. క్రీ॥ పూ॥ 326 లో సింధులోయ ప్రవేశించాయి గ్రీకు సైన్యాలు.

అప్పుడు దేశమంతా ముక్కలు ముక్కలుగా బల హీనంగా ఉంది. స్వదేశ రాజులలో ఐకమత్యం లేదు. గ్రీకు సైన్యంలో గల క్రమశిక్షణ స్వదేశ రాజుల సైన్యాలలో ఉండేది కాదు.

అందుచేత సులభంగా అలెగ్జాండర్ కొన్ని ప్రాంతా లను జయించ గలిగాడు.

ఈవిధంగా పరదేశ పాలనలో కొంతవరకూ, నిరంకుశ చక్రవర్తులైన నందుల పాలనలో కొంతవరకూ, నలిగిపోయి, చైతన్య విహీనమైన ఆర్యావర్తంలో రాజకీయ ఐక్యత స్థాపించిన గౌరవం చంద్రగుప్తునికే దక్కింది.

మౌర్య చంద్రగుప్తుని జన్మ వృత్తాంతం గురించి అనేక గాధలున్నాయి. అందులో ఎక్కువ ప్రచారంలో ఉన్న కథ ఇది.

నంద సామ్రాజ్యాధినేత మహా పద్మనందునకు మురఅనే ఉంపుడుగత్తె ఉంది. ఆమెకూ మహా పద్మనందునకూ జన్మించిన బిడ్డడే చంద్రగుప్తుడు.

చంద్రగుప్తునికి మౌర్య చంద్రగుప్తుడనీ, అతని సామ్రాజ్యానికి మౌర్య సామ్రాజ్యమనీ పేరు రావటానికి కారణం మురే.

నంద సామ్రాజ్యంలో చంద్రగుప్తుడు సేనాధిపతిగా ఉండేవాడు. కాని అతనిని పరాభవించి, సామ్రాజ్యంలోంచి తరిమివేశారు నందులు.

దానికి కారణం ఉంది. చంద్రగుప్తుడు వేశ్యాపుత్రుడనే భావంతో నందులు చులకనగా చూసేవారు. వేశ్యాపుత్రుణ్ణి లోకం గౌరవించదు. దానికి తోడుగా చంద్రగుప్తుడు మహావీరుడని పేరుగాంచాడు. ధైర్య సాహసాలలో అతనికి మించిన పురుషుడు లేడని ప్రజలు కొనియాడుచున్నారు. అతడు రూపవంతుడు, సుగుణశీలుడు. నందులకు

చంద్రగుప్తునిపై సహజమైన అసూయ ఉంది. అది దినదిన ప్రవర్ధమాన మౌతున్నది. ఆ ఈర్ష్య పొంగి పొర్లి, చివరకు చంద్రగుప్తుని సామ్రాజ్యంనుండి బహిష్కరించటం వరకూ వచ్చింది.

ఈ విధంగా పరాభవం చెంది, రాజనగరు వదిలి అడవుల పాలయిన చంద్రగుప్తుడు నందులపై పగబట్టాడు. నంద సామ్రాజ్యం సర్వనాశనం చేయగలనని ప్రతిన బట్టాడు. అందుకోసం నిద్రాహారాలు వర్జించి మార్గాన్వేషణ ప్రారంభించాడు.

అప్పుడు అలెగ్జాండరు పంజాబులో నున్నాడు. చంద్రగుప్తుడు గ్రీకు సామ్రాట్టును దర్శించి, నందులను నిర్మూలించటంలో తనకు సహాయం చేయమని అభ్యర్థించాడు. నూనూగు మీసాల నూత్న యవ్వనంతో - ఇంకా పసితనం తొంగి చూస్తున్న చంద్రగుప్తుని కోరిక అలెగ్జాండర్‌కు అపహాస్యంగా కన్పించింది.

చంద్రగుప్తుని పరిహసించాడు సికిందర్. ఆత్మాభిమానం మూర్తీభవించిన చంద్రగుప్తుడు సికిందర్‌కు గట్టిగా సమాధానం చెప్పాడు. 'చేతనైతే సహాయం చేయవలెను. చేతకాకపోతే ఊరుకొనవచ్చును గాని ఇలా పరిహసించుట సభ్యత కాద'ని మందలించాడు.

పిట్ట కొంచెము కూత ఘన మన్నట్లు ఇంత యువకునికి ఎంత పొగరు తలకెక్కినది, అని భావించి ఉగ్రుడై చంద్రగుప్తుని తల నరికివేయమని ఆజ్ఞాపించాడు అలెగ్జాండర్.

ఆ రోజుతో చంద్రగుప్తుని జీవితం సమాప్తం కావల సిందే. కాని అదృష్టవంతుణ్ణి ఎవరు చెరపగలరు? భావి భారత సామ్రాట్టు అయిన చంద్రగుప్తుని జీవితం ఆ విధంగా ఎందుకు పరిసమాప్తమై పోతుంది?

అలెగ్జాండర్ ఆజ్ఞ వినగానే - చంద్రగుప్తుడు మెరపులా తన అశ్వాన్ని అధిరోహించి శరవేగంతో దూసుక పోయాడు. గ్రీకు వీరులు అతన్ని బంధించాలని వెన్నాడారు. కాని వారి ప్రయత్నం ఫలించక వెనుదిరిగి రావలసివచ్చింది.

ఇప్పుడు చంద్రగుప్తునికి ఇద్దరు శత్రువులయ్యారు. మొదటి శత్రువు నందుడు. రెండవ శత్రువు సికిందర్. అంతేకాదు, పరదేశీయులైన గ్రీకు సైనికులు, మాతృదేశంలో చొచ్చుకురావటం, స్వజాతీయులపై అధికారం చెలాయించటం, అత్యాచారాలు జరపటం, చంద్రగుప్తుడికి మహావమానంగా తోచింది.

నంద సామ్రాజ్య నిర్మూలనంకంటె, మాతృభూమి నుండి గ్రీకు సైనికులను బయటకు తరిమివేయటం ముఖ్యమని అతడు భావించాడు.

ఇందుకు కేవలం ఒక వ్యక్తి భుజబలం చాలదు. బ్రహ్మాండమైన సైన్యంతో దండెత్తి వచ్చాడు అలెగ్జాండర్. అతన్ని జయించటానికి, తానుకూడా అంత సైన్యాన్ని తయారుచేయాలి, దానికి తగిన శిక్షణ యివ్వాలి. అప్పుడు గదా గ్రీకు సామ్రాట్టును పరాభవించటం?

కాని అదృష్ట వశమున గ్రీకు సైన్యంలో తిరుగుబాటు జరిగింది. గ్రీకు సైన్యములను జీలం నది వద్ద పురుషోత్తముడను స్వదేశ రాజు అడ్డగించాడు. పురుషోత్తముడు మహావీరుడు గ్రీకు సైన్యములను అడ్డగించగల సైన్యబలం తన దగ్గర లేదని పురుషోత్తమునికి తెలియకపోలేదు. కాని మాతృభూమిని పర దేశీయులకు విడిచిపెట్టటం కంటె, తుదివరకూ పోరి వీరస్వర్గం అలంకరించటం సముచితమని ఆ వీరునినమ్మకం.

పురుషోత్తముని దగ్గర గొప్ప గజదళమున్నది. గ్రీకులకు గజబలం లేదు. అందుచేత మొదట గ్రీకు సైన్యం కొంత తటపటాయించింది. కాని ఒకనాటి అర్ధరాత్రి సమయంలో, జోరున వాన కురిసి, తుపాను చెలరేగుతున్న సమయంలో, అలెగ్జాండర్ సింధునదిని దాటి అకస్మాత్తుగా పురుషోత్తముని మీద బడెను.

ఇరుపక్షముల వారికి ఘోర యుద్ధం జరిగింది. దురదృష్టవశమున పురుషోత్తముని ఏనుగు బెదిరి రణరంగములో చిందులు తొక్కుతూ పారిపోసాగింది. ఈ దృశ్యముగాంచి పురుషోత్తముని సైన్యమంతయూ అధైర్యము చెంది, చెల్లా చెదరైనది.

ఈ ఘోర సంగ్రామంలో విజయలక్ష్మి గ్రీకులనే వరించింది. స్వాభిమాని, మహావీరుడు పురుషోత్తముడు గ్రీకు సైనికుల బందీ అయినాడు. రెక్కలు విరచికట్టి గ్రీకు సైనికులు పురుషోత్తముని అలెగ్జాండర్ వద్దకు గొనిపోయిరి.

అలెగ్జాండర్ పురుషోత్తముని చూసి 'ఓయీ! నిన్నేమి చేయమందువు?' అని ప్రశ్నించెను.

పురుషోత్తముడు అవంతయైన భీతిల్లక, స్వాభిమాన మతిశయింపగా 'ఒక చక్రవర్తి వేరొక చక్రవర్తిని ఎట్లు గౌరవించునో అట్లు గౌరవించుము' అని సమాధానము చెప్పెను.

ఈ పల్కులు విన్న అలెగ్జాండర్ ఆశ్చర్య పులకితుడైనాడు. ఏనుగు బ్రతికిననూ చచ్చిననూ వేయి - అనునట్లు గెలిచిననూ, ఓడిననూ ఒకేరీతి ఆత్మాభిమానాన్ని కాపాడుకొన్న పురుషోత్తముని సగౌరవంగా ఆహ్వానించాడు. సరసన కూర్చుండమని ఆసనమిచ్చి, అతని ధైర్య సాహసములకు కానుకగా, తాను జయించిన రాజ్యమును అతనికి తిరిగి యిచ్చినాడు.

ఈ సంగ్రామము క్రీ॥ పూ॥ 326 లో జరిగింది. దీనితో భారత వీరుల హృదయ మెటువంటిదో గ్రీకులకు అవగతమైనది. ఈ దేశమును జయించుట కష్టమను విషయము వారి హృదయముల బలపడినది. దానికి తోడుగా మగధ రాజ్యాధిపతి నందునికి ఆరువేల ఏనుగులు గల గజదళమున్నది. ఆ విషయము వేగులవారి వలన గ్రీకులకు తెలిసినది. అంతే కాదు మాతృదేశము వదలి, యుద్ధములు చేయుచూ, యింకనూ ముందుకు సాగిపోవుటకు గ్రీకు సైనికులు యిష్టపడలేదు. యుద్ధములతో వారి ప్రాణములు విసిగినవి. యింటి మీద బెంగ వారిలో క్రమముగా వ్యాపించుచున్నది.

ఇన్ని వ్యతిరేక పరిస్థితులు ఎదుర్కొనలేక అలెగ్జాండర్ తన జైత్రయాత్ర ముగించుకొని వెనుకకు మరలెను. సింధునదీ ముఖద్వారమునగల పాతాళమను రేవు పట్టణము చేరి నియార్కస్ అను సేనానికి కొంత సైన్యమిచ్చి, ఓడలలో పంపెను. మిగిలిన సైన్యముతో అలెగ్జాండర్ బెలూచిస్థానము మీదుగా తిరుగు ప్రయాణము సాగించెను. క్రీ॥ పూ॥ 324 లో అలెగ్జాండర్ పర్షియా చేరుకున్నాడు.

అలెగ్జాండర్ భారత భూమిని వదలిపోగానే, అతడు జయించిన భారత రాజ్యములో తిరుగుబాట్లు చెలరేగినవి.

పంజాబులో మొదటి సారిగా గ్రీకులందరూ చంప బడిరి. అచ్చట గ్రీకు పాలన అంతమొందింది. ఈ వార్తలు అలెగ్జాండర్‌కు చేరినవి. కాని అతడేమియూ చేయలేక పోయెను. ఆ తరువాత సంవత్సరానికి రాజధానీ నగరమైన బాబిలన్‌లో అలెగ్జాండర్ మరణించాడు. అప్పటికి ఆయనకు ముప్పది మూడేండ్లు మాత్రమే.

అలెగ్జాండర్ దండయాత్రతో భారతదేశం అల్లకల్లోలమయింది. కాని దానివల్ల శాశ్వత ఫలితాలు పేర్కొనదగినవి లభించలేదు. అలెగ్జాండర్ మరణించగానే అతడు భారత దేశంలో స్థాపించిన గ్రీకుసామ్రాజ్యంకూడా నశించింది.

ఈ సంఘటన ప్రపంచ చరిత్రలో అనేకసార్లు పునరావృత్తమైన ఒక నగ్న సత్యాన్ని నిరూపిస్తుంది.

సామ్రాజ్యాలు నిర్మించటంకంటె వాటిని నిర్వహించటం కష్టం. ఒక జాతిని ఒక జాతి తాత్కాలికంగా జయించి,

విజయభేరి ప్రయోగించటం సాధ్యమైతే కావచ్చును. కాని చిరకాలం ఒక జాతి వేరొక జాతిపై ఆధిపత్యం వహించటం మాత్రం చరిత్రలో ఎన్నడూ జరిగే విషయం కాదు.

ఇది ఒక్క అలెగ్జాండర్ విషయంలోనే కాదు. ఆ తర్వాత ప్రపంచ చరిత్ర పుటల్లో ప్రముఖంగా కన్పించే నాదిర్షా, ఘజనీ, ఘోరీ మొదలు నెపోలియన్, హిట్లర్ మొదలైన వారి వరకూ, ఇదే సత్యాన్ని నిరూపిస్తున్నారు.

అలెగ్జాండర్ మరణవార్త భారతదేశం చేరటానికి రెండు మూడు మాసాలు పట్టింది. ఆ వార్త తెలియగానే గ్రీకు సామ్రాజ్యంపై భారత దేశంలో తిరుగుబాటు జరిగింది. ఈ తిరుగుబాటు జరిపించిన విప్లవ నాయకుడు చంద్రగుప్తుడు.

చంద్రగుప్తుడు ఈ కార్యం ఎలా సాధించ గలిగాడు? చంద్రగుప్తుని తల్లి ముర మొరియోలు అనే ఆటవిక జాతికి చెందినది. అందుచేత చంద్రగుప్తునికి ఆ ఆటవిక జాతులపై కొంత పలుకుబడి ఉంది. వారిని ఒక సైన్యంగా కూర్చుకుని క్రీ॥ పూ॥ 322 లో తన నొక రాజుగా ప్రకటించుకున్నాడు.

ఆ తర్వాత తన జన్మ విరోధులైన నందులను నిర్మూలించటంలో నిమగ్నమయ్యాడు చంద్రగుప్తుడు. తన ఆటవిక సైన్యంతో మగధపై దండెత్తి వెళ్ళాడు. కాని మగధను జయించలేక వెనుదిరిగి రావలసి వచ్చింది. అందుకు అనేక కారణాలు కూడుకున్నాయి. మొరియోలు ధైర్యసాహసాలలో గానీ, ప్రభు భక్తిలోగాని నందుని సైనిక బలగానికి

ఏమాత్రం తీసిపోడు. చంద్రగుప్తుడు కూడా సైన్యాలు నడపటంలోనూ, యుద్ధతంత్రం పన్నటంలోనూ సమర్థుడే.

కాని నంద సైన్యం బాగా శిక్షణ పొందిన సైన్యం. నందులలో అంతఃకలహాలు ప్రారంభమయ్యాయి గాని, యింకా తీవ్రరూపం ధరించలేదు. అంతేకాదు. యుద్ధంలో విజయం సాధించటానికి కావలసింది ఒక్క భుజబలం మాత్రమే గాదు, బుద్ధిబలం కూడా అవసరం.

ఆ సహాయం చంద్రగుప్తునికి అనతికాలంలోనే లభించింది. చాణిక్యుడు అనే బ్రాహ్మణుడు చంద్రగుప్తునికి అండగా నిలిచాడు. ఇకనుంచి మౌర్య సామ్రాజ్య చరిత్రలో నిజమైన నాయకుడు చాణుక్యుడు.

చాణుక్యునికి కౌటిల్యుడు అనే నామాంతరం ఉంది. ఈయన తక్షశిలకు చెందిన బ్రాహ్మణుడు. మహా మేధావంతుడు. రాజ నీతిజ్ఞుడు. రాజ తంత్రంలో ఇంత విశేష ప్రజ్ఞా పాండిత్యాలు గల ధీశాలిని భారత చరిత్ర చూడలేదు. కాని అటువంటి మహా పురుషుని కూడా, అహంభావంతో నందులు పరాభవించారు. నందులు బ్రాహ్మణ మత ద్వేషులు. నిండుసభలో చాణిక్యుని పరాభవించి బయటకు గెంటించారు.

ఆ అవమానాగ్నితో నందులను సర్వనాశనం చేయగలనని ప్రతిన బట్టి చాణిక్యుడు బయలుదేరాడు.

కౌటిల్యుడు కారణజన్ముడు. ఒక మహార్థాన్ని సాధించటం కోసం అతను జన్మించాడు. విపరీతమైన పట్టుదల,

కార్య శూరత్వమూ, అతని శరీరంలోని ప్రతి అణువులోనూ జీర్ణించాయి.

'సుజన్ముడైన బ్రాహ్మణుని శునకముకంటె హీనముగా ఛీత్కరించి పరాభవించిన నందులపై, బ్రాహ్మణ పరాభవాగ్ని ప్రజ్వరిల్లి వారినీ, వారి సామ్రాజ్యమునూ, దహించి భస్మం చేస్తుంది' అని శపించాడు చాణిక్యుడు.

'ఓ నందులారా! ఆనాడు మీరు హాహాకారము లతో కన్నీరు మున్నీరుగా విలపించుచూ, నా క్షమాభిక్ష అర్థిస్తారు. ప్రాణభిక్ష పెట్టమని ప్రార్థిస్తారు. ఆనాడు మిమ్ము లను క్షమించను సుమా!' అంటూ నందులను బెదరించాడు బ్రాహ్మణుడు.

అది కేవలం బెదరింపుగాదు. చాణుక్యుడు నందులపై పగబట్టిన పామైనాడు. ప్రక్కలో బల్లెమైనాడు. అతడు అనుకున్న పని జరిగే వరకూ విశ్రాంతి తీసుకొనే వ్యక్తి కాదు.

చాణుక్యుని పట్టుదల ఎటువంటిదో నిరూపించే ఒక కథ చెప్తాను.

నందులచే అవమానించబడి, ఆ పరాభవం సహించ లేక జనపథాలను విడిచి, కానల్లో తారాడుతున్న చాణిక్యుని కాలికి ఒక ముల్లు గ్రుచ్చుకుంది.

చాణిక్యుడు మండిపడి 'ఓసీ! బ్రాహ్మణునిపై నీకు గూడ అంత చులకన భావమా? చూడుము నిన్నేమి చేసె దనో' అంటూ ఆ ముల్లును కాల్చి, భస్మముచేసి నీటగలిపి

గటగట దాని వైచెను. అప్పుడుగాని ఆ బ్రాహ్మణుని హృదయము శాంతించ లేదు.

అంతటి ప్రచండ స్వభావుడు చాణుక్యుడు. 'శత్రువు శత్రువు, స్నేహితుడు' అని ఒక సామెత ఉంది. తనకు గర్భ శత్రువైన నందులపై పగబట్టిన చాణక్యుడు చంద్ర గుప్తునకు ఆప్తుడైనాడు.

చంద్రగుప్త చాణిక్యులు కలుసుకున్నారు. ప్రథమ ముహూర్తంలోనే వారిహృదయాలూ ఆశయాలూ ఒక్కటై పొంగినవి. తత్క్షణం చంద్రగుప్తుడు చాణిక్యుని పాదములపై వ్రాలి ఆయన ఆశీస్సులు అర్థించాడు.

ఇద్దరకూ ఒక టే శత్రువు. అది నంద సామ్రాజ్యం. ఇద్దరిదీ ఒకే ఆశయం అది నంద సామ్రాజ్య నిర్మూలన.

పసిడికి తావి అబ్బినట్లు చంద్రగుప్త చాణిక్యుల కలయికతో భారతేతిహాసంలో ఒక మహోజ్వల ఘట్టానికి నాందీ ప్రస్తావన జరిగింది.

వినాశకాలంలో విపరీత బుద్ధులు పుడతాయంటారు. నందుల్లో అంతఃకలహాలు తీవ్రరూపం ధరించినవి. నంద సైన్యంలో క్రమశిక్షణ క్రమంగా నశించి, ప్రభు భక్తి నీరసించింది.

చాణిక్యుని బుద్ధిబలం, చంద్రగుప్తుని భుజబలం, మొరియోల అంగబలం ఏకమై ప్రచండ శక్తితో విజృంభించినవి. అప్పటికే పునాదులు కదిలి ఊగీస లాడుతున్న

నంద సామ్రాజ్య సౌధం ఈ ప్రచండ మారుత వేగానికి పేక మేడలా కూలిపోయింది.

మగధ చంద్రగుప్తుని వశమయింది. నందులందరూ నిశ్శేషంగా నిర్మూలించబడ్డారు. ఆర్యావర్తంలో ఎదురూ బెదురూ లేని మౌర్య సామ్రాజ్య పతాక నింగికెగసింది.

భారత దేశ చరిత్రలో నూతనాధ్యాయం ప్రారంభ మయింది.

చంద్రగుప్తుడు మగధరాజ్యానికి వచ్చిన తర్వాత, ఆయన తిరిగి గ్రీకులతో యుద్ధం చేయవలసి వచ్చింది.

అలెగ్జాండర్ మరణానంతరం అతడు జయించిన మహా సామ్రాజ్యం ఎవరికి చెందాలీ అనే విషయంలో గ్రీకు నాయకులలో తగవులు ప్రారంభమయ్యాయి. తగిన వారసుణ్ణి అలెగ్జాండర్ నియమించలేదు. చివరకు పరిష్కారంగా ఆ మహా సామ్రాజ్యాన్ని అతని సేనాపతులందరూ, ఎవరికందినంతవరకూ వారు పంచుకున్నారు.

ఆసియాలోని గ్రీకు సామ్రాజ్యం కోసం ఆంటిగొనిస్ అనే సేనాధిపతికీ, సెల్యూకస్ అనే సేనాధిపతికీ తగవులు ప్రారంభమయ్యాయి.

దీర్ఘకాలం పోరాటం జరిగిన తర్వాత క్రీ॥ పూ॥ 312 లో బాబిలన్ నగరం సెల్యూకస్ వశమైంది. ఆతర్వాత ఆరు సంవత్సరాలకు అనగా క్రీ॥ పూ॥ 306 లో సెల్యూకస్ తనను రాజుగా ప్రకటించుకున్నాడు.

అలెగ్జాండర్ భారత దేశంలో జయించిన ప్రాంతా లన్నీ యిప్పుడు చంద్రగుప్తుని సామ్రాజ్యంలో భాగాలుగా ఉన్నాయి. వాటిని తిరిగి జయించాలని సెల్యూకస్‌కు బుద్ధి పుట్టింది. మహా సైన్యాన్ని కూర్చుకొని భారత దేశంపై దండెత్తి వచ్చాడు. పంజాబులో హిందూ యవన సైన్యా లకు ఘోర యుద్ధం జరిగింది. ఆ మహా సంగ్రామంలో సెల్యూకస్ ఓడిపోయాడు. కాని గ్రీకు భారత సామ్రాట్టుల మధ్య సంధి కుదిర్చాడు చాణక్యుడు.

సంధి ప్రకారం కాబూల్, కాందహార్, హీరట్‌లను చంద్రగుప్తునికి కానుకగా యిచ్చుటయే గాక, భారత సామ్రాట్టుకు తన కుమార్తెనిచ్చి వివాహముజేసి బంధుత్వము గలుపుకొనెను.

ప్రతి బహుమానముగా చంద్రగుప్తుడు గ్రీకు మామకు అయిదు వందల ఏనుగుల నిచ్చెను. సెల్యూకస్ సైన్యములో గజదళము లేదు. అతడు ముందు ముందు పాశ్చాత్య రాజ్య ముల జయించవలెనని కలలు గనుచుండెను. అందుకే గజ దళము మిక్కిలి ఉపకరించునని భావించి, అల్లుడిచ్చిన బహు మానమును బ్రహ్మానందముతో సెల్యూకస్ స్వీకరించెను.

నాటినుండీ చంద్రగుప్తుడు - సెల్యూకస్ ఆ జన్మాం తమూ స్నేహితులుగా నుండిరి. హిందూ-యవన సంబంధ ములు బలపడినవి. సెల్యూకస్ మెగస్తనీస్ అను నాతనిని తన రాయబారిగా భారత దేశము పంపెను.

మెగస్తనీస్ భారత దేశములో చిరకాలముండి, నాటి రాజ్య నిర్వహణము, సాంఘిక పరిస్థితులు మొదలైన వాటిని గురించి వర్ణించుచూ ఒక గొప్ప గ్రంథము రచించెను. దురదృష్టవశమున ఆగ్రంథమిప్పుడు కానవచ్చుట లేదు. కాని అందుండి గ్రీకు రచయితలు ఎన్నియో విషయములు తమ రచనలలో ఉదహరించి యుండుటచే, కొన్ని విషయములనైననూ మనము తెలుసుకొనగల్గుచున్నాము.

నందుల నిర్మూలన తర్వాత చంద్రగుప్తుడు ఆరులక్షల సైన్యాన్ని కూర్చుకొని, ఉత్తర హిందూస్థానంలో మిగిలిన భాగములను జయించి తన సామ్రాజ్యంలో కలుపుకొనెను.

కొన్ని తమిళ గ్రంథములలో చంద్రగుప్తుడు వింధ్య పర్వతములను దాటి దక్షిణ భారత పశ్చిమ తీరంలోని కొంకణ తీరాన్ని కూడా జయించినట్లు పేర్కొనబడినది.

తిరునల్వేలి ప్రాంతం - కావేరి లోయ వరకూ, మౌర్య సామ్రాట్టు జైత్రయాత్ర సాగించినట్లునూ, ఆతర్వాత మైసూరులో కొంత భాగాన్ని కూడా కైవశం చేసుకున్నట్లు, కొన్ని శాసనములవల్ల తెలియుచున్నది.

ప్లూటార్క్ వంటి గొప్ప ప్రసిద్ధ రచయితలు మౌర్య చంద్రగుప్తుడు భారత దేశము నంతనూ జయించి పాలించెనని వర్ణించుచున్నారు. కాని అది పూర్తిగా నిజమైన విషయం కాదు. భారత దేశంలో అధిక భాగం మౌర్య సామ్రాజ్యంలో చేరిఉన్నమాట మాత్రం నిజం.

చంద్రగుప్తుని సామ్రాజ్యము ఉత్తరమున పంజాబు రాష్ట్రము మొదలు దక్షిణ భారతంలో మైసూరు వరకునూ - పడమట సురాష్ట్రము మొదలు, తూర్పున నేటి బెంగాలు వరకూ వ్యాపించియున్నది. చంద్రగుప్తుడు సింహాసనం వర్జించేనాటికి, అతని అధికారం ఆఫ్ఘనిస్థాన్ లో కూడా చెల్లుతూ ఉండేది.

ఈ విధంగా సువిశాల సామ్రాజ్యం నిర్మించటమేగాక ఆ రాజ్యంలో నిర్దిష్టమూ, సమర్ధవంతమూ అయిన పరిపాలనా వ్యవస్థ నిర్మించాడు చంద్రగుప్తుడు. మౌర్య రాజ్యాంగం ఇంచుమించు కౌటిల్యుని అర్ధశాస్త్రం మీద ఆధారపడి నిర్మించబడింది.

అర్ధశాస్త్ర మనగా నేమి? అర్ధశాస్త్ర మనగా, రాజ్య సౌభాగ్యమును సాధించుటకు ముఖ్య సాధనంగా ఎంచబడిన, ప్రభుత్వం గురించీ, దాని స్వరూపం గురించి, నిర్మాణ నిర్వహణల గురించి కూడా, ఈ అర్ధశాస్త్రం కొన్ని సిద్ధాంతాలను సూచిస్తున్నది. చక్రవర్తికి ఉండవలసిన అర్హత లేమిటో, అతని అధికారములు, బాధ్యతలు, మంత్రులు, తదితర కీలకమైన ఉద్యోగుల గురించీ, కొన్ని ముఖ్య సూత్రాలను ఇది తెల్పుతున్నది.

మౌర్య సామ్రాజ్య నౌకకు నిజమైన సారధి చాణిక్యుడు. అతడు పరిపాలనా నిర్వహణలో నైతిక సూత్రాల కంటే, రాజ్య తంత్రానికే ఎక్కువ ప్రాధాన్యత యిచ్చాడు.

చాణిక్యుడు చంద్రగుప్తుని తర్వాత అతని కుమారుడు బిందుసారుని హయాంలో కూడా, మహా మంత్రిగానే ఉన్నా డని టిబెట్ రచయిత తార్ నాధ్ పేర్కొంటున్నాడు.

మౌర్య రాజ్యాంగంలో చక్రవర్తి సర్వాధికారి. ఒక్క మాటలో నియంత. గ్రీకులనుండి - నిరంకుశులయిన నందుల బారినుండి, భారత దేశాన్ని రక్షించి విముక్తి కలి గించిన చంద్రగుప్తుని హయాంలో కూడా, ప్రజలకు తగి నంత స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లభించలేదు. చంద్రగుప్తుని పరిపాలన అతి కఠినముగా ఉండేది. చిన్న దొంగతనం చేసిన దోషిని కూడ రక్షణ శాఖవారు మూడు రోజులలో బంధించి చిత్రవధ చేయాలని చంద్రగుప్తుడు శాసించాడు.

కౌటిల్యుని అర్థశాస్త్రం ప్రకారం రక్షణశాఖ తర్వాత రాజ్యాంగంలో, గూఢచారి శాఖకు అధిక ప్రాముఖ్యత చూపబడింది. గూఢచారులలో సంస్థానికులని కొందరూ, సంచారకులని కొందరూ ఉండేవారు. ప్రజల నిత్య జీవితంలో ఈ గూఢచారుల ఒత్తిడి విరివిగా ఉండేది. అందుచేత నాటి ప్రజలు భయంతోనూ, అనుమానంతోనూ జీవించేవారు.

హర్షుడు అనే చక్రవర్తి ఆస్థానంలో బాణుడు అనే మహాకవి ఉండేవాడు. ఆయనకు చాణిక్యుని రాజనీతి నచ్చలేదు.

' కౌటిల్యుని అర్థశాస్త్రంలో కుటిల తంత్రాలకు తప్ప దయాదాక్షిణ్యాలకు తావులేదు. క్రూరత్వం జాలువారుతూ,

కాలనాగువలె బుసలు కొట్టుచున్న కౌటిల్యుని కుటిల నీతి, చేతపడులూ, మారణహోమాలు చేసే వారికి మాత్రమే తగి నట్టిది ' అంటూ బాణకవి విమర్శించాడు.

కాని అట్టి క్రూర విధానం అనుసరించటానికి కారణం ఏమిటో మనం గమనించాలి. ఆ కాలం - నాటి స్థితిగతులు పరిశీలిస్తే మనకు సమాధానం దొరుకుతుంది.

మౌర్యులకు పూర్వం దేశంలో సమర్ధవంతమైన పరి పాలనా వ్యవస్థ లేకపోవటం చేత శాంతి భద్రతలు కరు వయ్యాయి. దొంగతనాలు, దోపిడీలూ ఎక్కువయ్యాయి. ఆ అస్థిర పరిస్థితులను అదుపులోకి తీసుకురావటానికి అంతటి కఠిన పాలన అవుసర మయ్యింది.

కౌటిల్యుని అర్ధశాస్త్రంలోనే రాజు ప్రజలకు సంరక్ష కుడుగా నుండి, వారి యోగక్షేమాలే పరమావధిగా నెంచి పరిపాలించవలెనని పేర్కొనబడింది.

ఏమైననూ చంద్రగుప్తుడు గొప్ప పరిపాలనాదక్షుడు. ఆయనకు పరిపాలనలో సాయము చేయుటకు మంత్రులను నియమించెను. ప్రభుత్వ కార్య కలాపములను శాఖలుగా ఉపశాఖలుగా విభజించి అధ్యక్షులను పెకుగల అధికారుల కప్పగించెను. ఇటువంటి అధ్యక్షులు మొత్తం ముప్పయి ఇద్దరు ఉండేవారు.

న్యాయ పరిపాలనలో చక్రవర్తి ప్రత్యేక శ్రద్ధ వహించాడు. రాజస్థానమే అత్యున్నత న్యాయస్థానంగా

ఉండేది. 800 గ్రామముల కొక స్థానీయము, 400 గ్రామముల కొక ద్రోణముఖము, 10 గ్రామముల కొక సంగ్రహణము – అను పేర్లుగల న్యాయస్థానములను అంతస్థులవారీగా నియమించెను.

చంద్రగుప్తుడు సామ్రాజ్యము నంతనూ కొన్ని రాష్ట్రములుగా విభజించెను. ఉత్తర పథము – అవంతి పథము – కళింగపథము – పాటలీపుత్రం – అను నాలుగు రాష్ట్రములు కలవు. ఉత్తర పథానికి తక్షశిల రాజధాని. అవంతి పథమునకు ఉజ్జయిని, కళింగకు తోయల, పాటలీపుత్రమునకు పాటలీపుత్రము రాజధానులుగా ఉండేవి. పాటలీపుత్రం మాత్రం చక్రవర్తి అధీనంలో ఉండేది. తక్కిన రాష్ట్రములను రాజకుటుంబమునకు చెందిన యువకులను తన ప్రతినిధులుగా చంద్రగుప్తుడు నియమించేవాడు. రాష్ట్ర పరిపాలనపై ఎప్పటికప్పుడు చక్రవర్తికి నివేదికలు అందజేయుటకు గూఢచారులు నియమించబడిరి.

పాటలీపుత్రమును పరిపాలించుటకు చంద్రగుప్తుడు ప్రత్యేకమైన పంచాయితీ వ్యవస్థను స్థాపించెను. నగరమును పాలించుటకు నగరాధ్యక్షులను కొందరు అధికారులు నియమించబడిరి. వీరు ఆరు శాఖలుగా విభజింపబడిరి.

ఈ ఆరు శాఖలవారూ ఆరు రకములైన బాధ్యతలు నిర్వహించేవారు.

మొదటి శాఖవారు జనన మరణ లెక్కలు తయారు చేసేవారు. రెండవ శాఖవారు నగరంలో పరిశ్రమల విష

యంలో శ్రద్ధ వహించేవారు. మూడవ శాఖవారు వర్తక వాణిజ్యములూ, తూకములూ మొదలైన విషయాలు చూసే వారు. నాల్గవ శాఖ పన్నుల విషయంలో పరిపాలన నిర్వ హించేవారు. అంతేగాక విదేశీయులకు రాకపోకల సౌకర్యం కలిగించటానికి ప్రత్యేకంగా ఒక శాఖ స్థాపించబడింది. దీనినిబట్టి చంద్రగుప్తుని కాలంలో విదేశీయులు విరివిగా మన దేశాన్ని దర్శించే వారని తెలియుచున్నది.

నగరాన్ని రక్షించటానికి ప్రత్యేక సిబ్బంది ఏర్పాటు చేయబడింది. వీరుకూడా ఆరు శాఖలుగా విభజించబడ్డారు.

మొదటి నాలుగు శాఖలూ, గజ తురగ కాల్బల నౌకాబలములనూ, అయిదవ శాఖ సైనిక సరఫరాలనూ, ఆరవ శాఖ యుద్ధ రథములనూ, పరిపాలించుచుండెను.

నేటి రెడ్ క్రాస్ సంఘమును పోలిన ఒక సంఘము మౌర్య సైన్యములో భాగముగా ఉండేది. రణరంగంలో క్షతగాత్రులయిన వారిని సురక్షిత శిబిరములకు జేర్చి వారికి ప్రథమ చికిత్స చేయుటమే ఈ సంఘము యొక్క కర్తవ్యం.

మౌర్య ప్రభుత్వానికి భూమిపన్ను ముఖ్యమైన ఆదాయంగా ఉండేది. ఇది పంటలో మూడవ వంతు విధించ బడేది. ఇంకా అమ్మకపుపన్ను, జనన మరణముల పన్ను, నీటి పన్ను మొదలైన పన్నులు కూడా విధించబడేవి.

చంద్రగుప్తుడు తన రాజ మందిరాన్ని అత్యద్భుతంగా నిర్మించుకున్నాడు. మందిరమంతా కలప దూలాలతో సే

నిర్మించబడింది. కాని ఆ దూలాలకు బంగారు రేకులు తొడుగ బడినవి. రకరకముల శిల్ప చాతుర్యము గల చిత్రములతో మందిరమంతా అలంకరించబడింది. మందిరం చుట్టూ అంద మైన తోట. ఆ తోటలో పరిమళాల విరజిమ్మే పూల మొక్కలు, విలాసార్థం నిర్మించబడిన సరస్సులు – మొద లయిన హంగులన్నీ రాజమందిరానికి కూర్చబడినవి.

రాజ కొలువు ఇంద్ర సభవలె చూపరులకు ఆశ్చర్య విభ్రాంతులు కలిగించేది. చంద్రగుప్తుడు ప్రజలకు దర్శన మీయదలచినచో బంగారు పల్లకీ నెక్కి పురవీధులగుండా పయనించెడివాడు. చిన్న చిన్న ప్రయాణములు గుర్రము పైనను, సుదీర్ఘ ప్రయాణాలు ఏనుగంబారీ మీదనూ చేయు చుండెడివాడు. ఎద్దులూ, ఏనుగులూ, మొదలైన జంతువుల పోటీ పందెములన్నచో చక్రవర్తికి ఎంతో యిష్టము.

సర్వ సాధారణముగా చక్రవర్తి దర్శనము ప్రజలకు లభ్యమయ్యెడిదిగాదు. యజ్ఞయాగాదులలోనూ, వేట సమ యములలోనూ, యుద్ధ భూమికి పోవునప్పుడు మాత్రమే చక్రవర్తి దర్శనము ప్రజలకు లభ్యమౌతూ ఉండేది.

సామ్రాజ్య రక్షణకోసం చంద్రగుప్తుడు గొప్ప సైన్యాన్ని తయారుచేసాడు. చక్కటి క్రమశిక్షణతో సమర్థ వంతంగా సైన్యం పరిపాలించబడింది. చంద్రగుప్తుని సైన్యంలో ఆరు లక్షల కాల్బలమూ, ముప్పైవేల అశ్వ దళమూ, తొమ్మిదివేల గజదళమూ ఉండేది.

కాల్బలములోని సైనికుల దగ్గర ప్రధానాయుధముగా ఒక ఖడ్గమూ, యింకా విల్లు అంబులు, బాకు మొదలైన ఆయుధములూ ఉండేవి. రథములు నాలుగు గుర్రములచే లాగబడెడివి. ఒక్కొక్క రథములో సారధిగాక, యిద్దరు వీరులు నిల్చి పోరుటకు అవకాశముండెడిది. ఇక ఒకొక్క ఏనుగుమీద నలుగురు వీరులకు చోటుండును. ఈ సైన్య మంతయూ ఒక యుద్ధతంత్ర కార్యాలయము యొక్క అజ మాయిషీ క్రింద ఉండేది.

చంద్రగుప్తుడు ప్రజోపయోగ కార్యాలలో కూడా ఎంతో శ్రద్ధ వహించాడు. భారత దేశం వ్యవసాయిక దేశం. ఈ దేశపు సౌభాగ్యం. వ్యవసాయం మీదనే ఎక్కువ ఆధార పడి ఉంది. అందు చేత వ్యవసాయానికి అత్యవసరమైన నీటి పారుదల విషయంలో చంద్రగుప్తుడు ప్రత్యేక శ్రద్ధ వహిం చాడు. ప్రభుత్వ శాఖలో వ్యవసాయ శాఖ నొక దానిని నెలకొల్పాడు. భూములను కొలిచి, పన్నులు నిర్ణయించటం ఆ శాఖవారి బాధ్యత.

దేశంలోని నాలుగు చెరగులకూ రాకపోకల సంబం ధాలు కల్పించటానికై, చంద్రగుప్తుడు అనేక రాజ మార్గా లను కూడా నిర్మించాడు. రాజధానియైన పాటలీపుత్రంనుండి, వాయవ్య సరిహద్దు రాష్ట్రం వరకూ నిర్మించబడిన 'గ్రాండ్ ట్రంక్ రోడ్' చంద్రగుప్తుని కాలంలో నిర్మించబడినదే.

చంద్రగుప్తుని కాలములో ప్రజలు వర్ణాశ్రమ ధర్మము ప్రకారము జీవించిరి. గ్రీకు రాయబారి మెగస్తనీస్ 'చంద్ర

గుప్తుని పరిపాలనలో భారతీయులు నమ్మదగిన వారనియూ, ధర్మపరులనియూ, మితవ్యయులనియూ వర్ణించెను.

అతి చిన్న వయసులో అధికారము చేపట్టిన చంద్రగుప్తుడు ఈ విధముగా ఇరవై నాలుగు సంవత్సరములు భారత దేశాన్ని పరిపాలించాడు.

చంద్రగుప్తుని జీవితపు చివరి ఘట్టం గురించిన చరిత్ర మనకు జైన గ్రంథాల్లో కనిపిస్తున్నది.

జైన పండితుడైన భద్రబాహుడు ఒకనాడు చంద్రగుప్తుని కడకు వచ్చి 'రాజా! నీ రాజ్యములో అనతి కాలములో ఒక పెద్ద క్షామము సంభవించనున్నది. అది పండ్రెండు సంవత్సరములు దేశమును పీడించును' అని చెప్పిపోయెను.

ఆ జోస్యము నిజమని కాలము నిరూపించెను. మౌర్య సామ్రాజ్యము అనతి కాలములోనే క్షామ దేవత వికృత నాట్యమునకు రంగస్థలమైనది. ఘోరమైన కరువు దేశంలో తాండవిస్తున్నది. లక్షలాది మానవులు, ఆలమందలూ, ఆకలిదప్పులకు తాళలేక మృత్యుదేవత కెరయైపోవుచున్నారు.

చంద్రగుప్తుని హృదయం కృంగిపోవుచుండెను. ఆ రోజులే వేరు. ఆ రాజులే వేరు. ప్రజల కష్టాలు తొలగించాలని అతడు విశ్వప్రయత్నం చేసాడు. కాని ప్రయోజనం లేకపోయింది. ఈ సంఘటనతో చక్రవర్తి మనస్సు వికలమైపోయింది. రత్నమయ స్వర్ణ కిరీటాన్ని పరిత్యజించాడు.

జైన గురువైన భద్రబాహుడు ఆసమయంలో ఉత్తర హిందూదేశం వదలి, తన పన్నెండువేలమంది శిష్యు

లతోనూ, దక్షిణ భారతానికి తరలి వెళ్ళున్నాడు. చంద్ర గుప్తుడు కూడా వారిని అనుసరించాడు. వింధ్య పర్వతములు దాటి, మైసూరు ప్రాంతంలో గల శ్రావణ బెల్గొలాలో చేరుకున్నాడు.

ఇప్పుడు చంద్రగుప్తుడు జైన మతస్థుడు. అతనికి జీవితం మీద విరక్తి పుట్టింది. జైన మత సిద్ధాంతం ప్రకారం కఠోర వ్రత విధానములను ఆచరించుచూ, శరీరమును శుష్కింపజేసుకొని అచ్చటనే చంద్రగుప్తుడు ఇహలోక యాత్ర చాలించెను.

శ్రావణ బెల్గొలాలో యిప్పటికీ, భద్రబాహుడూ, చంద్రగుప్తుడు నిస్సంగులై జీవించినట్లు తెలుపు చిత్రములు గలవు. చంద్రగుప్తుడు కడపటి రోజులలో నివసించిన కొండను యిప్పటికీ 'చంద్రగిరి' యను పేరున వ్యవహరించుచుందురు.

భారత దేశమును పరిపాలించిన అగ్రగణ్యులైన చక్రవర్తులలో చంద్రగుప్తుడొకడు. అతి చిన్న తనమున స్వయంకృషితో భారత సామ్రాజ్యమును స్థాపించిన సమర్థుడు. గ్రీకులను పారద్రోలి దేశమునకు విముక్తి ప్రసాదించిన మహామహుడు. సమర్థవంతమైన ప్రభుత్వము లేక చెల్లాచెదరై యున్న ఆర్యావర్తములో రాజకీయ ఐక్యత సాధించిన ప్రజ్ఞాశాలి. బ్రహ్మాండమైన సైన్యమునూ, సమర్థవంతమైన ప్రభుత్వ యంత్రమూ నిర్మించి నిర్వహించిన ఘనుడు చంద్రగుప్తుడు.

# అశోకుడు

భారతదేశ చరిత్రలోనే గాక ప్రపంచ చరిత్రలోనే అశోకుడు అగ్రగణ్యుడైన చక్రవర్తి యని H. G. వెల్స్ పండితుడు వక్కాణించెను.

తన ప్రజలయొక్క జీవిత సౌభాగ్యమునకే తన జీవితము సంకితము చేసిన త్యాగశీలుడు అశోకుడు, ఇక బౌద్ధ మత చరిత్రలో ఆ మత స్థాపకుడైన గౌతముని తరువాత అశోకుని కంటె ప్రముఖ వ్యక్తి కానరాడు.

భారతదేశ చరిత్రలో అశోకునితో పాటు పేర్కొన దగిన చక్రవర్తి ఒక్క అక్బర్ మాత్రమే.

అశోకుడు చంద్రగుప్తుని మనుమడు. బిందుసారుని కుమారుడు. బిందుసారుడు క్రీ॥ పూ॥ 300 సం॥ నుండి క్రీ॥ పూ॥ 273 వరకూ పరిపాలించెను.

బిందుసారుని జీవితము గురించి మనకంతగా వివరములు తెలియవు. ఆయనకు అమిత్ర ఘాతకుడని బిరుదుగలదు. దానిని బట్టి అతడు మహా వీరుడై యుండవచ్చునని ఊహించవచ్చును.

బిందుసారుని పరిపాలనా కాలములో అశోకుడు రాష్ట్ర పరిపాలనాధికారిగా నుండి కొంత అనుభవము గడించెను. అప్పుడు ఉజ్జయినిరాష్ట్రమునకు అధిపతిగా నుండెడివాడు. ఆ కాలములో తక్షశిల రాజధాని గల ఉత్తర పదములో

విప్లవము బయలుదేరేను. దానిని అణచివేయుటకు బిందు సారుడు తన కుమారుడైన అశోకు నచ్చటికి పంపెను.

అశోకుడు అనతి కాలములో తక్షశిలలో శాంతి భద్రతలు స్థాపించెను. అంతటి యోధాగ్రేసరుడు అశోకుడు.

బిందుసారునికి చాలనుంది కుమారులుండిరి. బిందు సారుని అనంతరం రాజ్య మెవరికి చెందవలెనను సమస్యపై వారిలో వారికి తగవులు సంభవించెను. చివరకు అశోకుడు విజయుడై క్రీ॥ పూ॥ 273 లో రాజ్యమునకు వచ్చెను. ఆ తరువాత నాలుగు సంవత్సరములకు పట్టాభిషేకము చేసుకొనెను.

ఆ తర్వాత పన్నెండు సంవత్సరములు ప్రశాంతముగా జరిగిపోయెను. క్రీ॥ పూ॥ 261 లో అశోకుడు సామ్రాజ్య వాదము ననుసరించి విజయ యాత్రకు బయలుదేరెను. మహానది - గోదావరీ నదుల మధ్యగల దేశమునకు కళింగ దేశమని పేరు. అది ఒకప్పుడు మగధ రాజ్యములో భాగమై యుండెను. కాని చంద్రగుప్త మౌర్యుని కాలములో విడిపోయి స్వతంత్ర రాజ్య మయ్యెను.

క్రీ॥ పూ॥ 261 లో జరిగిన కళింగ యుద్ధములో అశోకునికి పరిపూర్ణ విజయము లభించెను. కళింగ రాజ్యము మౌర్య సామ్రాజ్యములో లీనమై పోయినది.

కాని కళింగ యుద్ధము అశోకుని జీవితమునే తారు మారు చేసినది.

కళింగ దేశము మహా వీరులను గన్న భూమి. కళింగ ప్రభుత్వ సైన్యము అరవై వేల కాల్బలముతోనూ, వేయి అశ్వ దళము, ఏడు వందల గజ దళముతో కూడి యుండెను. కళింగ యుద్ధములో లక్షమంది మరణించిరి. లక్షా యాభై వేల మంది చెరపెట్ట బడిరి. యుద్ధ ప్రభావం వలన కరువులు సంభవించి, అంటు వ్యాధులు వ్యాప్తి చెంది లక్షలాది ప్రజలు మృత్యువువాత బడిరి.

ఈ మహా సంగ్రామంలో రక్త ప్రవాహ సిక్తమైన భీకర దృశ్యాలను గాంచిన అశోకుని మనస్సు వికలమై పోయింది. పశ్చాత్తాపం అతనికి పునర్జన్మ నిచ్చింది. జీవితంలో ఇకముందెన్నడూ యుద్ధములు చేయునని ప్రతిన బట్టాడు. ఈ సమయంలోనే అశోకుని బౌద్ధమతం ఆకర్షించింది.

అశోకుడు తన జీవిత శేషాన్ని బౌద్ధ ధర్మ ప్రచారంలోనే గడిపాడు. ఆ తర్వాత యిరుగు పొరుగు రాజ్యాలతో ఎంతో స్నేహ ధర్మాన్ని పాటించాడు. చేర, చోళ, పాండ్య, పల్లవ రాజ్యములతో స్నేహ సంబంధాలు ఏర్పాటు చేసుకొనెను.

యజ్ఞ యాగాదులలో విరివిగా కొనసాగుతున్న జంతు బలిని అశోకుడు నిషేధించాడు. సర్వ జీవ రాసుల యందునూ దయ కలిగి ఉండవలెననియూ, తల్లి తండ్రులనూ, గురువులనూ, మన్నించవలె ననియూ, అహింస పరమ ధర్మమనియూ, బ్రాహ్మణులనూ, సన్యాసులనూ ఆదరించి, సేవకుల యెడ దయకలిగి యుండవలెనని అశోకుడు ప్రకటించెను.

ప్రజల నైతిక ప్రమాణములను వృద్ధి చేయుటకు అశోకుడు ఎంతయో పాటుపడెను. ఈ ధర్మ ప్రచారమునకై అశోకు డనేక మార్గము లనుసరించెను. ప్రభుత్వములో ధర్మ మహా మంత్రులను నియమించి, ధర్మ ప్రచారమును వారి బాధ్యతగా చేసెను. రాకుమారి సంఘమిత్రను, రాకుమారుడు మహేంద్రను ప్రత్యేకముగా సింహళమునకు ధర్మ ప్రచార మునకై పంపెను. ఈజిప్టు - సిరియా ఎపిరస్, సైరీన్ మొదలైన విదేశములకు వేలాది బౌద్ధ ధర్మ ప్రచారకులను పంపెను.

పుళిందులు, శవరలు, రాట్టులు మొదలైన ఆటవిక జాతుల వారికి గూడా బౌద్ధ ధర్మము అర్థమగునట్లు ప్రచా రము చేయించెను. ధర్మ బోధనలను శిలా శాసనములుగా చెక్కించి, స్థాపించెను. ప్రజలకు సులభముగా అర్థమగు శైలిలో వాడుక భాషలో అవి వ్రాయబడెను. ఆ శాసనము లనేకములు యిప్పటికినీ నిలిచియున్నవి.

ఇవిగాక స్థూపములు, చైత్య గృహములు, సంఘా రామములు మొదలయిన 84 వేల కట్టడముల నిర్మించెను. వేటాడుట, మద్యపానము పాపమని నిషేధించెను. తాను స్వయముగా పవిత్రమైన జీవితమును గడపి ప్రజలకు ఆదర్శ ప్రాయుడయ్యెను.

పాటలీపుత్రమున గొప్ప బౌద్ధ మహాసభ జరిపించెను. అప్పుడు బౌద్ధ మతములో పొడసూపుతున్న శాఖా భేదము లను రూపుమాపుటకు ప్రయత్నించెను.

అశోకుడు పరిపాలనలో గూడ అనేక సంస్కరణలు ప్రవేశపెట్టెను.

దేశమందంతటనూ మానవులకేగాక పశువులకు గూడా వైద్య శాలలు నెలకొల్పెను. ప్రపంచ చరిత్రలో మొట్ట మొదటి సారిగా పశువులకు వైద్య శాలలు నెలకొల్పిన గౌరవం అశోక సార్వభౌమునకే దక్కినది. రాజ మార్గ ముల కిరుప్రక్కలా వటవృక్షముల నాటించెను. సత్రములు, విశ్రాంతి భవనములు నిర్మించెను. నూతులు త్రవ్వించి జలా శయములు నిర్మించెను.

క్రీ॥ పూ॥ 260 లో మొదటి సారిగా అతడొక శిలా శాసనము ప్రకటించి తన ధర్మ ప్రచారమునకు ప్రారం భోత్సవము జరిపెను.

సార్వభౌముని వ్యక్తిగత జీవితమంతయు పరివర్తన జెందినది.

క్రీ॥ పూ॥ 257 లో అనగా అతడు రాజ్యమునకు వచ్చిన పదునేడు సంవత్సరములకు, ఒక నూతన కార్య విధానమును అతడు నిర్ణయించుకొని, దానిని వరుసగా పదు నాలుగు శిలా శాసనములలో ప్రకటించెను.

క్రీ॥ పూ॥ 249 లో అశోకుడు భారతావనిలో బౌద్ధ పుణ్యక్షేత్రముల దర్శించెను. సార్వభౌముడు పాటలీపుత్రమున బయలుదేరి రాజమార్గము గుండా ప్రయాణముచేసి - యిప్పుడు ముజఫర్ పూర్, చంపారణ్ అని పిలువబడుచున్న మండలములను దాటి హిమాలయములను జేరెను.

అక్కడనుండి పశ్చిమమునకు తిరిగి కొండలను దాటి లుంబినీ వనము దర్శించెను. ఇది నేపాళ దేశమున కలదు. ఈ వనమందే గౌతమ బుద్ధుడు జననమందెను. బౌద్ధుల కిది పరమ పవిత్రమైన పుణ్యక్షేత్రము.

అశోకుని వెంట జనుదెంచిన ఉపగుప్తుడు సార్వభౌముని గాంచి 'ప్రభూ! ఇదయే జగదోద్ధారకుడు జన్మించిన పవిత్ర ప్రదేశము' అని చూపించెను. అశోకుడా ప్రదేశమును దర్శించినందులకు చిహ్నముగా అచ్చట నొక రాతి స్తంభము నెలకొల్పబడి దానిపై, పై పల్కులే వ్రాయబడెను.

ఆ తరువాత ఉపగుప్తుడు సార్వభౌముని కపిలవస్తు నగరమునకు గొనిపోయెను. గౌతముని బాల్య జీవితము ఈ కపిలవస్తు నగరమునందే గడచినది. గౌతముని తండ్రి శుద్ధోదనుడు కపిలవస్తు నగరమును రాజధానిగా చేసుకొని పరిపాలన సాగించిన శాక్యగణ క్షత్రియుడు. బౌద్ధ మతము వారికి కపిలవస్తు నగరము కూడ పవిత్ర పుణ్యక్షేత్రము.

ఆ తరువాత అశోక సామ్రాట్టు సారనాధ్ దర్శించెను. ఇది బెనారస్ చేరువలో నున్నది. ఇది కూడా బుద్ధులకు పుణ్యక్షేత్రము. గౌతముడు బుద్ధుడైన తరువాత మొదటి సారిగా తన ధర్మ ప్రభోదము సారనాధ్‌లోనే ప్రారంభించెను.

సారనాద్ నుండి మౌర్య సార్వభౌముడు శ్రావస్తిని దర్శించెను. బుద్ధుడిచ్చటనే అనేక సంవత్సరములు నివసించెను. శ్రావస్తినుండి బుద్ధ గయకు బయలుదేరెను. ఈ బుద్ధగయ

సమీపమున గల ఉరువీల యను గ్రామమందు గౌతముడు ఘోర తపస్సు చేసినట్లు ఇతిహాసము. చివరకు ఈ గయలో ఆయన నిశ్చల సమాధిలో నుండగా, జ్ఞానోదయమై బుద్ధుడైనాడు. ఈ మహా పరివర్తన గౌతముని ముప్పది యైదవ యేట జరిగినది.

బుద్ధ గయనుండి బయలుదేరి మౌర్య సామ్రాట్టు కుశి నగరము దర్శించెను. ఇది గోరక్‌పూర్ జిల్లాలోగలదు. ఇచ్చటనే బుద్ధుడు మహా పరినిర్వాణము చెందెను. ఆనాటికి ఆ మహా పురుషుని వయస్సు ఎనుబదియైదు సంవత్సరములు.

క్రీ॥ పూ॥ 240 లో అశోకుడు బౌద్ధ సన్యాసి యయ్యెను. కాని రాజ్యమును పరిత్యజించలేదు. బుద్ధుడు నిర్వచించిన సత్యములు నాలుగు. ప్రపంచము దుఃఖమయ మనియు, దుఃఖమునుండి ప్రతి జీవియు విముక్తి సాధించ వలెననియు, దుఃఖమునకు మానవునిలోని కోరికయే కారణమనియు, ఆ కోరికను వర్జించిన ఆత్మ శాంతించి దుఃఖము వైదొలగు ననియూ బుద్ధుడు ప్రబోధించెను. మానవ జీవితమునకు గమ్యమైన నిర్వాణము సాధించుటకు అష్టాంగ మార్గమును బుద్ధుడు బోధించెను. ఈ అష్టాంగ మార్గమువలన మానవుడు జనన మరణ దిగ్బంధమునుండి విముక్తి చెంది అనశ్వరమైన పరిపూర్ణ శాంతిని పొందవచ్చునని ఆయన మతము.

అశోకుడు నాటినుండి బౌద్ధ భిక్షువై అహింస - సత్యము - అంతర్దృష్టి - మొదలైన బౌద్ధ మత సిద్ధాంతములను తు, చ, తప్పక నిత్యజీవితములో ప్రతిష్ఠించుకొనెను.

బౌద్ధ భిక్షువైన వెంటనే అశోకుడు రాజ్యమును విసర్జించక పోయిననూ, రాజ్యాంగములో పాల్గొనుట చాలా వరకు తగ్గించెను. పరిపాలనా భారమంతయు మహా మంత్రుల కప్పగించి తాను నామ మాత్రముగా సింహాసనమున గూర్చుండియుండెను.

రాజకీయములకూ, ధార్మిక జీవితమునకూ సమన్వయము సాధించి, ధర్మ పరిపాలన గావించుట ప్రపంచ చరిత్రలో అనన్యమైన విషయము కాదు గాని అపూర్వమైన విషయము.

క్రీస్తు తర్వాత 527 ప్రాంతములో చైనా దేశమును పాలించిన హిషియావెన్ ను ఈ సందర్భములో అశోకునితో పోల్చవచ్చును. హిషియావెన్ లియాంగ్ వంశమునకు చెందిన ప్రభువు బౌద్ధ మతమును స్వీకరించి, భిక్షుక జీవితము గడుపుచూ, రాజ్య తంత్రము నెరపిన సవ్యసాచి.

ధర్మమును రాజకీయమును ముడిపెట్టుట సామాన్య విషయము కాదు. సామాన్యులకు సాధ్యము కాదు. కత్తిపై సాము వంటిది. అశోకునివంటి కారణ జన్ములకు మాత్రమే అది సాధ్యమైన విషయము.

అశోకుని విషయములో సైతమూ, ఆయన చివరి రోజులలో సామ్రాజ్యమును నిర్వహించలేక అసమర్థుడయ్యెనని వక్కాణించు గాథలున్నవి.

నేటి ప్రపంచ జన సంఖ్యలో మూడవ వంతుమంది బౌద్ధులై యుండుటకుగానీ, ప్రపంచములోని గొప్ప మతము

లలో నొకటిగా బౌద్ధ మతము పరిగణింపబడుటకుగానీ, అశోకుని నిర్విరామ నిర్వ్యాజ కృషియే కారణమనుట అతిశయోక్తిగానీ, అత్యుక్తిగాని కాదు.

అశోకుడు గొప్ప నిర్మాత. గుప్త సామ్రాట్టు చంద్రగుప్త విక్రమాదిత్యుడు ఆర్యావర్తమును పాలించుచున్న రోజులలో ఫాహియాన్ అను చీనా యాత్రికుడు పాటలీపుత్రమును దర్శించెను. అప్పటికి నూత్న భవనమువలె గన్పడుచుండిన అశోకుని రాజమందిరమును జూచి - ఆ మహా నిర్మాణ శిల్ప కౌశలమునకు ఆశ్చర్యము చెంది - దానిని ఫాహియాన్ యిట్లు వర్ణించెను:

'ఈ పాటలీపుత్ర నగరమున ఏడు శతాబ్దులనాడు నిర్మించబడిన అశోకుని మందిరము మానవ మాత్రులు నిర్మించినట్లు తోచుటలేదు. దేవతలు అశోకుని ధర్మ నిరతికి మెచ్చి నిర్మించియుందు రనిపించుచున్నది.

అశోకుడు కావించిన అనేక నిర్మాణములు నేడు కాల గర్భములో కలసిపోయినవి. కాలమునకు లొంగక యింకనూ నిలచియున్న అశోకుని నిర్మాణములు మధ్య ఇండియాలో సాంచి ప్రాంతమున గల స్థూపములు మాత్రమే. సాంచి ఉజ్జయిని సమీపమున గలదు.

గయ ప్రాంతమునగల బారబర్ కొండలలో అశోకుడు నిర్మించిన గుహాలయములలోని శిల్ప సౌందర్యము ఈజిప్టు శిల్పమును పోలియుండునట!

అశోకుని నిర్మాణములలో ఆయన శిలాశాసనములు ముప్ఫయి వరకూ మనకు లభించుచున్నవి. అవి కొండ గుహలమీదనూ, రాతి స్తంభముల మీదనూ చెక్కబడి నట్టివి. అశోక మౌర్యుని చరిత్ర వ్రాయుటకు ఆ శిలా శాసనములే ఏ చరిత్రకారునకైననూ ముఖ్యాధారము లగుచున్నవి.

ఆ శిలా శాసనములు అశోకుని సామ్రాజ్య విస్తీర్ణము నిర్ణయించుటకు చాలవరకు తోడ్పడుచున్నవి. పశ్చిమమున అరేబియా సముద్రమునుండి, తూర్పున బ్రహ్మపుత్రవరకూ, ఉత్తరమున కాశ్మీరమునుండి దక్షిణమున పెన్నానదివరకూ ఆయన సామ్రాజ్యము విస్తరించియుండెను. మన ఆంధ్ర ప్రదేశ్ లోని నెల్లూరు, కడప అశోకుని సామ్రాజ్యపు దక్షిణ సరిహద్దులుగా పేర్కొన వచ్చును.

ఈ విధముగా జీవితము నంతనూ ధర్మ ప్రబోధనకై అంకితము జేసిన అశోకుడు క్రీ॥ పూ॥ 231 లో మగధ సామ్రాజ్యమునకు ఒకానొకప్పుడు రాజధానియైన రాజగృహ నగరప్రాంతమున గల ఒక కొండపై దివంగతుడయ్యెను.

ప్రపంచ చరిత్రలో అశోకుడు అగ్రగణ్యుడైన చక్రవర్తి యనుటలో అతిశయోక్తి లేదు. ప్రచండ పరాక్రమవంతుడయ్యును, గొప్ప సైన్యము గల్గి జైత్రయాత్రలు సల్పి సామ్రాజ్యము విస్తరింప జేయుటకు అవకాశము గలవాడయ్యును, అశోకుడు అహింసా మార్గము నవలంబించెను.

విశ్వశ్రేయస్సుకై జీవితాంతము వరకు పాటుపడెను. గొప్ప సామ్రాజ్యముల స్థాపించుట గాక అనంత మానవకోటి హృదయ సామ్రాజ్యముల జయించుటయే ఉత్తమ మని అతడు భావించెను.

అశోకుని మరణముతో మౌర్య సామ్రాజ్య భానుడు నీరసించి, క్రమముగా అస్తమించెను. ఇందుకు అశోకుడే పూర్తిగా బాధ్యుడని కొందరు చరిత్రకారులు ఆరోపించు చున్నారు.

అశోకుని రాజనీతి వలన సైన్యము వీరోత్సాహము నశించి, నిర్వీర్యమైనది. మౌర్య సైనికుల ఆయుధములకు తుప్పు పట్టినది. అహింసలో నమ్మకము లేని గ్రీకులకు అశోకుని సిద్ధాంతము నచ్చినట్లు కన్పించదు. మౌర్య సామ్రాజ్యము బలహీనముగా నున్న సమయమును చూచు కొని గ్రీకులు మరొక్కసారి విజృంభించిరి. కాబూలులోయు, పంజాబులపై గ్రీకులు దండయాత్రలు సాగించిరి. దీనికితోడుగా అశోకుని అనంతరము రాజ్యమునకు వచ్చిన దశరథుడు, బృహద్రథుడు మొదలగు రాజులు అసమర్థులు. తాత ముత్తా తలు నిర్మించిన సువిశాల సామ్రాజ్యమును వారు నిర్వహించ లేక పోయిరి. ఆంధ్ర దేశమున శాతవాహనులూ, కళింగ దేశమున చేత వంశీయులూ స్వతంత్ర రాజ్యముల స్థాపించిరి.

అశోకుని బౌద్ధ మతాభిమానము వలన బ్రాహ్మణు లందరూ ఏకమై శత్రుత్వము వహించి మౌర్య సామ్రాజ్య

ముపై కత్తిగట్టిరి. చాతుర్వర్ణ పద్ధతిలో బ్రాహ్మణులకుగల అగ్రస్థానము, బౌద్ధ మతములో లేకపోయెను. మౌర్య సామ్రాజ్య భాగమైన కాశ్మీరము జలౌకుని నాయకత్వము క్రింద స్వతంత్రమైనది. అదే మార్గమున వీరసేనుని నాయకత్వమున గాంధారము స్వతంత్రమైనది. చివరకు పుష్యమిత్రుడను బ్రాహ్మణుడు క్రీ॥ పూ॥ 187 లో కడపటి మౌర్యుని జయించి, శుంగవంశమును స్థాపించెను.

మౌర్య సామ్రాజ్య పతనమునకు ఎక్కువ బాధ్యత వహించవలసినవాడు అశోకుడే కావచ్చును. కాని ఆయన ఆదర్శములు, మహోన్నతములు. ఆయన జీవితము ఆదర్శ ప్రాయము.

మౌర్య సామ్రాజ్యము నశించిననూ మానవాళి చరిత్రలో అశోక సార్వభౌముని నామము సువర్ణాక్షరములతో లిఖించబడి, ఆచంద్రార్కముగ మెఱయుచుండును.

అశోక ప్రభుత్వాదర్శముల గౌరవించుటకే స్వతంత్ర భారత పతాకలో అశోక చక్రము వెలయించబడినది.



# పుష్యమిత్రుడు

మౌర్య వంశ నిర్మూలన తర్వాత మగధను పాలించిన శుంగ వంశమునకు మూలపురుషుడు పుష్యమిత్రుడు. శుంగులు ప్రసిద్ధ భరద్వాజ బ్రాహ్మణ కుటుంబమునకు చెందినవారు. పుష్యమిత్రుడు బ్రాహ్మణుడైనను, కత్తిబట్టి సామ్రాజ్యము స్థాపించి, బౌద్ధ మత ప్రభావము వలన నిర్జీవమై పోయిన హైందవ మతమునూ, సంస్కృత సాహిత్యమును పునరుద్ధరించెను.

అశోకుని కాలమున బౌద్ధమత ప్రాభవము పెరిగినది. చాతుర్వర్ణ వ్యవస్థ ప్రాతిపదికగా గల హైందవ మతము వెనుకబడిపోయి బ్రాహ్మణ ప్రాభవము నశించెను. బ్రాహ్మణగణమంతయు మౌర్యసామ్రాజ్యమునకు వ్యతిరేకులై యుండిరి. అట్టి వాతావరణములో బ్రాహ్మణుడైన పుష్యమిత్రుడు కడపటి మౌర్య చక్రవర్తి అయిన బృహద్రథుని వధించి, మౌర్య సామ్రాజ్యమును నిర్మూలన చేసి, శుంగ వంశమును స్థాపించెను.

మౌర్య సామ్రాజ్య ప్రజలుగూడ శుంగవంశ స్థాపనకు సుముఖతజూపిరి. అసమర్థులైన కడపటి మౌర్యుల కాలములో దేశమున శాంతి భద్రతలు కరవయ్యెను. అశోకుడు నిర్మించిన సువిశాల సామ్రాజ్యములోని రాష్ట్రములు క్రమముగా ఒక

టొకచే స్వాతంత్ర్యమును ప్రకటించుకొనుచుండెను. కళింగ స్వతంత్ర రాజ్యమయ్యెను. ఆంధ్రలో శాతవాహన వంశము రాజ్యము నిర్మించి విజృంభించుచుండెను. దీనికి తోడుగా గ్రీకులు మరల విజృంభించి చెదురు మదురుగా మగధరాజ్యముపై దాడిచేసి, ప్రజాజీవితమును అల్లకల్లోల పరచుచుండిరి. అశోకుని బౌద్ధమత ప్రభావము వలన, యుద్ధములకు దూరమైన మౌర్య సైన్యములో రణోత్సాహము నశించుటచే మౌర్య రాజ్యముపై శాత్రవగణమున కాశలు మిక్కుటమగుచుండెను. ఈ వ్యతిరేక పరిస్థితులలో ప్రవాహమునకెదురేగి నిలువదొక్కుకొన గల సమర్థత కడపటి మౌర్యులకు లేక పోయెను.

ఈ విషయమును గ్రహించిన ప్రజలు మౌర్య వంశము విరగనై తమను రక్షించగల మరొక వంశము అధికారములోకి రావలయునని కోరుకొనుచుండిరి. అందుచేత పుష్యమిత్రునికి, స్వీయ సామ్రాజ్యము స్థాపించుట సులభతరమయ్యెను.

పుష్యమిత్రుడు కడపటి మౌర్యుడైన బృహద్రథుని సైన్యములో సేనాధిపతిగా ఉండెడివాడు. క్రమముగా సైన్యములో తన పలుకుబడిని పెంపుచేసుకొని, కట్టుదిట్టముగా సైన్యమును అదుపాజ్ఞలలో పెట్టుకొనెను. సమయము కనిపెట్టి, సైన్యములతో రాజనగరు ముట్టడించెను. భీరువైన బృహద్రథుడు, పుష్యమిత్రుని సైన్యమును జూచినంతనే,

ఎదురుదాడి చేయుటకు ధైర్యములేక లొంగిపోయెను. పుష్య మిత్రుని సైన్యములు నిరాటంకముగా కోటలో ప్రవేశించినవి.

పుష్యమిత్రుడు శత్రుశేష మపాయకరమని భావించి బృహద్రథుని వధించి, తన మార్గము నిష్కంటకము జేసుకొని సింహాసన మధిరోహించెను.

ఈ ఉదంతము కొంతవరకూ పురాణ గాథలలో మనకు లభ్యమగుచున్నది. మౌర్య సామ్రాజ్యమునకు రాజధానీ నగరమైన పాటలీపుత్రమునే పుష్యమిత్రుడు తన సామ్రాజ్యమునకు గూడ రాజధానిగా చేసికొనెను. సామ్రాజ్యము నందలి మధ్యరాష్ట్రము లన్నియు పుష్యమిత్రుని అధికారమును గుర్తించి లొంగిపోయినవి.

శుంగ సామ్రాజ్యము మౌర్య సామ్రాజ్యము కంటె చిన్నది. గంగా మైదానము మొదలు పంజాబు వరకునూ, పాటలీపుత్రము మొదలు దక్షిణమున నర్మదా నదివరకునూ, శుంగ సామ్రాజ్యము వ్యాపించియుండెను.

రాజ్యమునకు వచ్చిన వెంటనే సామ్రాజ్య కాంక్షతో పుష్యమిత్రుడు బీరారు మీదకు యుద్ధమునకు పోయి, దానిని జయించెను.

ఆ జైత్రయాత్ర అంతటితో ఆగిపోవలసి వచ్చినది.

అంతకు ముందు గ్రీకు రాజగు ఏంటిగోనస్ కాబూలు నేలుచున్న శుభగసేనుని జయించి, ఆ రాజ్యమును ఆక్రమించెను. ఎంటిగొనిస్ విజయమును గాంచి అతని అల్లుడైన

డెమెట్రియస్ కూడా హిందూదేశముపై దండెత్తివచ్చి, పంజాబును జయించి, సింధులోయ దిగువ భాగమును ఆక్రమించెను. ఈ విజయములను గాంచి గ్రీకులలో అలెగ్జాండర్ కన్న గొప్పవాడని ప్రసిద్ధిగన్న మీనాండర్ బ్రహ్మాండమైన సైన్యముతో భారతావనిపై దండెత్తి వచ్చెను. ఈ మీనాండరు మహావీరుడు. బాక్ట్రియా చక్రవర్తియైన యూక్రెటైట్సుకు బంధువు. అతడు సింధునదీ మైదానమును శరవేగముతో వశపరచుకొని సురాష్ట్రముపై బడెను. అనతి కాలములో సురాష్ట్రము అతని వశమైపోయినది. తరువాత పశ్చిమ తీరమునగల కొన్ని రాష్ట్రముల నాతడాక్రమించెను. ఇంకనూ ముందుకు సాగి మధురను జయించి, రాజపుత్ర స్థానములోని చిత్తూరు వరకు తన జైత్రయాత్ర సాగించి, మగధపై బడుటకు సిద్ధముగా నుండెను.

అదే సమయములో పుష్యమిత్రునకు మరొక ఉపద్రవము ఎదురయ్యెను.

అశోకునిచే జయింపబడి, ఆయన సామ్రాజ్యములో భాగముగానున్న కళింగ, అశోకుని మరణానంతరము స్వాతంత్ర్యము ప్రకటించుకొనెను. క్రీ॥ పూ॥ మొదటి శతాబ్దమున కళింగదేశము చేతవంశ పరిపాలనలోనికి వచ్చెను. ఈ వంశపు మూడవ రాజైన ఖారవేలుడు గొప్ప యుద్ధవీరుడు. అప్పుడు ఆంధ్ర దేశమును పాలించుచున్న శాతవాహనులు సైతము ఖారవేలుని గౌరవించుచుండిరి. ఖారవేలుడు మగధను

జయింపవలెనను సంకల్పముతో మహాసైన్య సమేతముగా ఆంధ్రరాజ్యముగుండా ప్రయాణముచేసి మగధపై బడెను.

పుష్యమిత్రునకూ, భారవేలునకూ తీవ్రముగా పోరాటము జరిగెను. అందు విజయలక్ష్మి భారవేలునే వరించినది గాని, పుష్యమిత్రుడు పూర్తిగా పరాజితుడు కాలేదు. కేవలమూ తాత్కాలిక విజయము సాధించి భారవేలుడు వెనుదిరిగిపోయెను. తిరిగి పుష్యమిత్రుడు సైన్యముల గూర్చుకొని, దురాక్రమణకు సంసిద్ధుడైయున్న మీనాండర్‌ను ఎదిరించెను. అతి కష్టముతో మీనాండర్‌ను వెనుకకు తరుమగల్గెను. కాని మీనాండరును పూర్తిగా జయించుట పుష్యమిత్రునకు సాధ్యము కాలేదు. ఆ తరువాత కొన్ని సంవత్సరముల వరకూ, పశ్చిమ భారత దేశములో కొంత భాగము మీనాండరు అధికారములో నుండెను.

ఈ రెండు ఉపద్రవములు ముగిసిన పిమ్మట అశ్వమేధ యాగము జేయవలెనని పుష్యమిత్రుడు సంకల్పించెను. హైందవ సాంప్రదాయము ప్రకారము అశ్వమేధ యాగము జేసిన సార్వభౌముని అధికారమునకు పృథ్విలో తిరుగు లేదని యర్థము.

అశ్వమేధ యాగము చేయు విధానము చిత్రముగా నుండును. యాగకర్త అయిన రాజు ఒక జవనాశ్వమును భూ ప్రదక్షిణము చేయుటకు స్వేచ్ఛగా వదలిపెట్టును. ఆ అశ్వము వెంటనే రాజుగాని, అతని సైన్యముగాని బయలు

చేరెదరు. అశ్వము ఏఏ దేశముల కాలు పెట్టునో, ఆ దేశ ముల ప్రభువులు, యాగకర్త అయిన ప్రభువునకు లొంగినటు లంగీకరించవలెను. లేదా అతని సైన్యముతో పోరుటకు సిద్ధము కావలయును. కావున మహావీరుడు దక్క అన్యులు అశ్వమేధ యాగమును జేయజాలరు. ఆ విధముగా నిరాటంక ముగా అశ్వము తిరిగి తిరిగి రాజధానీ నగరము జేరిననాడు అది యాగ కర్త అయిన రాజునకు ఘన విజయముగా భావించబడును. ఆ సందర్భములో మహా వైభవముగా రాజు యాగము చేసి, అందు భూ ప్రదక్షిణము చేసి వచ్చిన యశ్వమును ఆహుతిగా నొసంగును.

అశ్వమేధయాగ మనగా ఇంత తతంగమున్నది.

పుష్యమిత్రుడు అశ్వమును వదలి దాని వెనుక తన మనుమడైన వసుమిత్రుని బంపెను. వసుమిత్రుడు నూరు మంది రాజపుత్రులతో అశ్వమును రక్షించుటకు బయలుదేరెను.

సింధునదీ ప్రాంతము యాగాశ్వము ప్రవేశించుసరికి, కొందరు గ్రీకు సైనికులు సాయుధులై దాని నడ్డగించిరి. వసుమిత్రునకూ, గ్రీకులకూ పోరు సంభవించెను. అందు గ్రీకులే పరాజితులైరి. అశ్వము ముందుకు సాగిపోయెను. వసుమిత్రు నెదిరించిన గ్రీకులు మీనాండరు సైన్యములోని వారే. ఈ పోరాటము నేటి బుందేల్ ఖండ్ - రాజపుటానా సరిహద్దు ప్రాంతమున జరిగినది.

ఈ విధముగా శత్రువులు పరాజితులైన పిదప, ఆర్యావర్తమునకు సర్వాధికార సార్వభౌమునిగా తనను ప్రకటించుకొనగల అర్హత పుష్యమిత్రునకు కల్గినది. వెంటనే పుష్యమిత్రుడు యాగము నేర్పాటుచేసి, దానికి రమ్మని ఆహ్వానించుచూ తన కుమారున కిట్లు జాబువ్రాసెను.

'నాయాగమునకై వదిలిపెట్టబడిన అశ్వమును కాపాడుటకు వసుమిత్రుని నియమించితిని. యాగాశ్వము సింధునది దక్షిణ తీరమున బోవుచుండగా, కొందరు యవనులు దానిని బంధించి తస్కరించుకొని పోవుటకు ప్రయత్నించిరి. అప్పుడు ఉభయ పక్షముల వారికి తీవ్రమైన పోరాటము జరిగినది. ఈ పోరులో మహావీరుడైన వసుమిత్రుడు శత్రువుల పారద్రోల గల్గెను. యవనులు తస్కరించ దలచుకున్న అశ్వము నాతడు రక్షించగల్గెను. ఈ సందర్భములో నేను చేయుచున్న యాగమునకు, నీవు కోడలితో కలిసి బయలు దేరి రావలసినది.'

ఈ ఉదంతము మాళవికాగ్నిమిత్రమను నాటకము లోనిది. దానిని కాళిదాస మహాకవి సంస్కృతమునరచించెను.

ఈ అశ్వమేధ యాగమును దర్శించి నటుల సుప్రసిద్ధ వైయాకరణుడైన పతంజలి వర్ణించియుండెను. ఈ యాగముతో మౌర్యుల కాలములో నిద్రాణమైయున్న బ్రాహ్మణ వ్యవస్థ తిరిగి పునరుజ్జీవింపసాగెను. బౌద్ధ మతము వేదములనే గాక, రక్తపాతమునకు దారితీయు యజ్ఞయాగాదుల కూడ

నిరసించినది. తదనుకూలముగనే అశోకుడు యజ్ఞయాగాదుల నిషేధించెను. దాని ఫలితముగా బ్రాహ్మణాధిపత్యము అంతరించెను.

పుష్యమిత్ర శుంగునితో ప్రాచీన బ్రాహ్మణ సాంప్రదాయము తిరిగితలయెత్తి గుప్తుల కాలములో పతాకనంటినది.

పుష్యమిత్రుడు బ్రాహ్మణ మత పునరుద్ధరణతో సంతృప్తి జెందలేదు. బౌద్ధ మత వినాశనమునకు గూడ కంకణము గట్టుకొనెను. బౌద్ధ నిర్మాణముల నిర్మూలించి, బౌద్ధ భిక్షువుల చిత్రహింసలకు గురిజేసెను. వేలాది బౌద్ధ భిక్షువులు పుష్యమిత్రుని కరవాలమునకు బలియై పోయిరి. మిగిలినవారు విదేశములకు పారిపోయి ప్రాణములు రక్షించుకొనిరి.

ఇది బుద్ధ సాంప్రదాయమునకు చెందిన చరిత్ర. పుష్యమిత్రుని కాలములో నిస్సంశయముగా బౌద్ధమత ప్రాభవము తగ్గెను.

పుష్యమిత్రుడు క్రీ॥ పూ॥ 75 లో మరణించెను.

పుష్యమిత్రుని పాలన వలన హిందూ మతము, హైందవ సంస్కృతి, సంస్కృత భాష పునరుద్ధరింపబడెను. కళలు వృద్ధి జెందెను. సుప్రసిద్ధ వైయాకరణుడైన పతంజలి వంటి పండితులు పుష్యమిత్రుని ఆస్థానమును అలంకరించిరి.

పుష్యమిత్రుని అనంతరము అగ్నిమిత్రుడు, సుజ్యేష్ఠుడు, వసుమిత్రుడు మున్నగువారు రాజ్యమునకు వచ్చిరి.

గాని, వారిని గురించి వ్రాయదగిన విశేషము లంతగ కానవచ్చుటలేదు.

పురాణ గాథల ననుసరించి పుష్యమిత్రుడు స్థాపించిః శుంగవంశము మగధను 112 సంవత్సరములు పరిపాలింః నట్లు తెలియుచున్నది.

